ఉ॥ చిత్తమ! చంచలత్వము నశింపగ నే పఠియించినట్టి యీ
యుత్తమ భావజాలముల నుత్సుకతన్ దినచర్యయందు లో
43 కోత్తరదీక్ష బూనగలవో! పరమానుభవౌఘసంస్థితా
యత్త విశాల శాంతమధురామృతపానము గల్గు .......

ఓ చిత్తమా! నీ చంచలత్వం పోవటానికి నేను పఠించిన యీ యుత్తమ భావాలను ఉత్సాహంతో నీ దినచర్యలో పాటించటానికి లోకోత్తరమైన దీక్షకు పూనుకోగలవా? ఆ దీక్షచేత పరమానుభవ సంస్థితి కలిగి, దానిచే నీ విశాల శాంతమధురామృతపానం చేయ గల్గుతావు, చపలత్వం పోవాలిసుమా!

చ॥ చనవున బాలబాలికల సన్నిధిజేర్చుచు నాడినావు, పై
వనితలతోడ నెయ్యమున భవ్య సుకర్మల జేసినావు క్రొ
44 న్నన బురుషాళితో గలిసి సాఖ్యముగా జరియించినావు, ఈ
యనుభవమెల్ల జాలదె! పరాశ్రయమెందుకు వెర్రి ......

ఓ వెర్రిచిత్తమా! బాలబాలికలను దగ్గరకుజేర్చి ఆడుకున్నావు. తర్వాత స్త్రీలతోకలిసి అనేక మంచి కర్మలను చేశావు. పిదప పురుషులతో చక్కగా కలిసి తిరిగావు. ఈ అనుభవాలన్నీ చాలవా? ఇక పరుల నాశ్రయించటం దేనికి?

ఉ॥ చేసితివన్నదానముల, జేసితి పెద్దల సంగతిన్, గడున్
జేసితి గ్రంథపాఠముల, జేసితివింక నసంఖ్య సత్కృతుల్,
45 చేసినవెల్ల జాలవె! విశేషముగా శ్రమజెంది యిట్టులే
వేసట నిచ్చు కార్యముల వీడుము శాంతి గడింప .......

ఓ చిత్తమా! అన్నదానాలు చేశావు. పెద్దల సాంగత్యంచేశావు.

గ్రంథపాఠాలను చదివావు. అనేక సత్కార్యాలు చేశావు. ఈ చేసిన్న వన్నీ చాలవా? ఈ విధంగా అధికంగా శ్రమ చేశావు. ఇక శాంతిని పొందాలంటే యీ శ్రమతో కూడిన కార్యాలను వదులుకో..

ఉ॥ సుంతయు జంకులేక జెడుమందురొకండనుమాత్రముంటి నా
స్వాంతములోన నెంచి, సువిచక్షణదృష్టి యభావమౌట, నా
46 పంతయు సందులేక జగమంతట నిండుచు దేవుడుండ, నే
కాంతము గల్గునే యెచటనైన మరెవ్వరికైన......

ఓ చిత్తమా! ఒక్కడనుమాత్రమే ఉన్నానని మదిలో భావించి, వివేకం లోపించుటచేత, ఏమాత్రం జంకులేక చెడిపోతారుసుమా! సర్వ ప్రపంచంలో, సర్వత్ర వ్యాపించి భగవంతుడుండగా యిక ఎవరికైన ఏకాంతం అనేది కలుగుతుందా?

శా॥ ఏకాంతంబుననుంటినంచనుచు దుష్కృత్యంబులన్ జేసినన్
లోకాంతర్గతవర్తి ఈశ్వరుడు తా లోనుండి వీక్షింపడే?
47 ఏకాంతంబనునట్టిదే భ్రమసుమా దృగ్గోచరాతీతుడై
నీ కార్యంబుల జూచు సాక్షి యతడై నిక్కంబుగా ......

ఓ చిత్తమా! ఏకాంతంలో ఉన్నానని భావించి, చెడు పనులను చేస్తే లోకాంతర్గతవర్తి అయిన ఆ ఈశ్వరుడు లోనుండి చూస్తూంటాడుగా! ఈ బాహ్యదృష్టికి అగోచరుడై, నీవు చేసే పనులను చూచే సాక్షి యథార్థంగా ఆ ఈశ్వరుడే. అందువలన ఏకాంతం అనేదే భ్రమసుమా!

చ॥ ఎరుగనిదానిగూర్చి మనమెంతయినన్ బలుకంగవచ్చు, నీ
వెరిగినచో వచించుటలదృశ్యములౌ నిదియే రహస్య, మా

48 యెరిగివారు మౌనముసుమీ! మరి వర్ణనసేయుచుందు రీ
యెరుగనివారు గొప్పగ, నిదే భ్రమ యీ ధరలోన ......

ఓ చిత్తమా! తెలియనిదానిగూర్చి మాటల్లో ఎన్ని అయినా వచింపవచ్చు. కాని యథార్థ తత్త్వాన్ని గ్రహిస్తే యిక మాటలు లేవు సుమా! ఇదే పరమరహస్యం. తెలిసినవారు మౌనం వహిస్తారు. తెలియనివారుమాత్రం అనేకవిధాలుగా, చాల గొప్పగా వర్ణిస్తుంటారు. ఇదే యీ లోకంలో భ్రాంతి.

శా॥ మౌనంబే పరమార్థ సాధకము సన్మౌనాన సర్వంబు స్వా
ధీనంబౌ నిది సత్యమౌనుసుమ! నీ ధీరత్వమున్, యోగ్యతల్
49 దీనన్ బ్రస్ఫుటమౌను, కాక జగతిన్ ధిక్కారమున్ జేయుచో,
గానంరాదిక శాంతి, మూఢు పగిదిన్గా నెంతునే ......

ఓ చిత్తమా! మౌనం పరమార్థ సాధనం. యథార్థ మౌనం చేత సర్వం స్వాధీనం అవుతుంది. ఇది సత్యం. నీ ధైర్యస్థైర్యములు, యోగ్యతలు యీ మౌనంలో తెలుస్తాయి. అలాకాక యీ ప్రపంచాన్ని ధిక్కరిస్తే అసలు శాంతియే మృగ్యం అవుతుంది. అది మూఢంగా పరిణమిస్తుందిసుమా!

ఉ॥ లొంగుటకాదు మౌనమున లోకజయంబది, యిద్రియంబులున్
భంగమునొందు మౌనమున, భావవిభూతియు వృద్ధి పొందు, సు
50 ప్పొంగెడు నాత్మశక్తి, యఘపుంజము నాశమునొందు, గాన నే
భంగినినైన దీని సముపార్జన ముఖ్యముగాదె......

ఓ చిత్తమా! మౌనం అంటే ఏమిటో చెప్పుతాను విను. మౌనం అంటే లొంగటం కాదు, లోకాన్ని జయించటం. ఈ మౌనంలో యింద్రి

యసమూహం భంగం పొందుతుంది. భావాభివృద్ధి కలుగుతుంది. ఆత్మ శక్తి ఉప్పొంగుతుంది. పాపసంచయం నశిస్తుంది. ఇటువంటి యీ మౌనాన్ని ఏవిధంగానైనా ఆర్జించటం ముఖ్యంగదా!

చ॥ ఇది విడరాని సాధన, మహిన్ గల సర్వమతాలకున్ సుఖ
ప్రదమగు మార్గరాజము, ప్రభావయుతంబు, ఫలంబు వెంటనే
51 యొదవును ప్రస్ఫుటక్రియ, నిక యోచనలేల ధరింపు మౌనమున్
సదమలతత్త్వయోగమును, సద్గతి గల్గును నీకు ......

ఓ చిత్తమా! ఈ మౌనం ఎంతకాలము అనే ప్రశ్న లేదు ఎల్లప్పుడూ దీన్ని పాటించవచ్చు. ఈ లోకంలో ఉన్న సర్వమతాలక్కు సుఖాన్ని ప్రసాదించు రాజమార్గమిదే. ప్రభావంతో కూడుకున్నది సద్యోఫలితాన్ని ప్రసాదిస్తుంది. కాన యిక నీవు ఆలోచించక నిర్మల తత్త్వయోగమైన మౌనాన్ని ధరించు. దానిచేత నీకు సద్గతి లభిస్తుంది. సుమా!

మ॥ అతిసూక్ష్మంబుగ దాగు దుర్గుణసమూహంబున్ బలత్కార సం
గతితోడన్ వెలిబుచ్చి త్రుంచి సతమున్ గళ్యాణమున్ గూర్చు, యీ
ప్ర 52 ప్రతిలేనట్టి పథంబు, మౌనమును నీ ప్రావీణ్యతన్ బూనుమా,
స్తుతిపాత్రంబిది సమ్మతంబిది మహాశోభార్థివై .......

ఓ చిత్తమా! ఈమౌనం, మనకు తెలియకుండ అతిసూక్ష్మంగా లోపల ఉండే దుర్గుణ సమూహాన్ని బలవంతంగా బయటకు త్రోసి నశింపజేస్తుంది. ఎల్లప్పుడు కల్యాణాన్ని చేకూరుస్తుంది. ఇటువంటి ఎదురులేని మార్గమైన మౌనంలో ప్రావీణ్యతను సంపాదించుకో శోభా

సంయుతమైన జీవితాన్ని కోరుకో, అనేక సంస్తుతులకు పాత్రమైనదీ మౌనం, యోగ్యమైనదికూడా.

చ॥ మననము వృద్ధిగాంచనగు మౌనము, ధ్యానము దానినుండియే
జనితము, ధ్యానజన్యముగ సంభవమౌను సమాధి, దానితో
53 జను వెనువెంట మోక్షమను సత్యమునే గ్రహియించి, మౌన సా
ధన గల శ్రేష్ఠతన్ దెలిసి,దాని ధరించి చరింపు ......

ఓ చిత్తమా! మననం అభివృద్ధిచెందితే మౌనం అవుతుంది. మౌనంనుండి ధ్యానం పుట్టుతుంది. ఆ ధ్యానంవలన సమాధి కలుగుతుంది. ఆ సమాధితోడనే మోక్షం అనే సత్యాన్ని గ్రహించు. కాన మౌనముయొక్క శ్రేష్ఠత్వాన్ని గ్రహించి, సంచరించు.

మ॥ తులలేనట్టి యఖండశక్తి యిక నీతో నైక్యమై యొప్ప, రం
జిలు బ్రహ్మద్యుతి నీముఖంబున యశశ్శ్రీ నాట్యమాడంగ, శో
54 భిలు నీ శక్తి ప్రపంచమంతటను గంభీరస్థితిన్, గాన ని
ర్మల మౌనవ్రతదీక్ష బూనుమిక నీ లక్ష్యంబుగా ......

ఓ చిత్తమా! మౌనంవలన అతులమైన అఖండమైన శక్తి లభించి, నీలో లీనం అవుతుంది. నీ ముఖంలో బ్రహ్మతేజస్సు చిప్పిలుతుంది. యశస్సు నాట్యం చేస్తుంది. ప్రపంచమంతట నీ శక్తి గంభీరంగా ప్రకాశిస్తుంది. కాన యీ నిర్మల మౌనాన్ని నీ ఆదర్శంగా భావించి, యిక మౌనవ్రతదీక్షకు పూనుకో.

మ॥ సుచిరంబైన యథార్థ సంస్థితులలో శోభిల్లి మోదింప నెం
చుచు దీర్ఘంబుగ బ్రహ్మచర్యమున దృష్టిన్ బెట్టలేకున్న నీ

55 జీచె క్షేత్రంబును నింపబూని తగు గట్టే గట్టకున్నట్టు లా
టిచె దెల్విం గని బ్రహ్మచర్యమున నుండన్ బూనవే ......

ఓ చిత్తమా! ముఖ్య విషయం చెప్పుతాను విను. పొలాన్ని నీటిచే నింపబూనిన రైతు, చుట్టూ గట్టు కట్టక, ఎంతకాలానికైనా పొలం నింపలేనట్లుగా, శాశ్వతమై, యథార్థమైన ఆత్మసంస్థితులలో శోభించి, ఆనందించాలంటే తీవ్రంగా నీ దృష్టిని బ్రహ్మచర్యంమీద నిలపకున్నచో ప్రయోజనం శూన్యం. అందుచేత బాగా గ్రహించుకుని బ్రహ్మచర్యాన్ని సక్రమంగా పాటించటానికి పూనుకో.

శా॥ ఆర్యుల్ గొందరు బ్రహ్మచర్యపదవాక్యార్థంబునే చూచి, యా
కార్యానన్ గల సౌఖ్యమున్ దెలియకన్ గాబోలు, వాకొందు రే
56 చర్యన్ బ్రహ్మమునందు నుంట యని, మోక్షార్థంబుకై యెట్టి స
త్కార్యంబుల్ గలవో యెరుంగకయె పల్కంజూతురో ......

ఓ చిత్తమా! కొంతమంది, బ్రహ్మచర్య పద అర్థాన్నే స్వీకరించి, అందలి యథార్థ ఆనందాన్ని తెలుసుకొనలేకనేమో 'బ్రహ్మంలో చరించటం బ్రహ్మచర్యం' అని చెప్పుతూ ఉంటారు. కాని మోక్షం పొందటానికి ఎటువంటి సత్కార్యాలు ఉన్నవో తెలుసుకోలేక వారు ఆ విధంగా మాట్లాడుతుంటారుసుమా!

మ॥ అగునగు బ్రహ్మచర్యమన సాంతము బ్రహ్మమునందు వాసమే
యగు,నిజమున్ గ్రహింప, విషయంబులుశూన్యములై యశక్తులై
తగునటులాత్మశక్తి పరతంత్రములై తనరొంద నిట్టి రీ
తిగ నిక బ్రహ్మచారి జగతిన్ విషయాల మునుంగు .........

ఓ చిత్తమా! పూర్తిగా బ్రహ్మంలో నివసించటమే బ్రహ్మచర్యం అవుతుంది. యథార్థం ఆలోచిస్తే యీ బ్రహ్మచర్యంలో విషయాలు పూర్తిగా నశిస్తాయి. శక్తిహీనమవుతాయి. ఆత్మశక్తి అధీనంలో ఉంటాయి. ఈవిధంగా విషయములన్నీ నశించిన నిక బ్రహ్మచారి లౌకిక విషయాలలో మునగటం అసంభవం.

శా॥ అర్థంబున్ గ్రహియింపనెంచి పద వాక్యార్థంబులన్ వాని ల
క్ష్యార్థంబున్ క్రమరీతి నేర్చి పిదపన్ గాంక్షించు తత్త్వంబులన్
58 సార్థంబై హృదినుంచి యాచరణమున్ సాధింపగా నెంచుటే
సార్థక్యంబు నొసంగు, సాధన యగున్ సత్యంబుగా ......

ఓ చిత్తమా! అర్థాన్ని గ్రహించేముందు, పదముయొక్క వాక్యంయొక్క అర్థాలను, వాని లక్ష్యార్థాలను సక్రమంగా నేర్చుకొని, తరువాత తాను కాంక్షించిన ఆత్మతత్త్వాన్ని అర్థయుక్తంగా హృదయంలో నిలుపుకొని, ఆచరణలో సాధించటానికి పూనుకోటమే అర్థయుక్తమైన సాధన అవుతుంది. ఇది యథార్థంసుమా!

చ॥ ద్వివిధము బ్రహ్మచర్యమగు వీర్యనిరోధమునన్ బలంబు పొం
ది, విమల చిత్తమున్ గనునదే ప్రథమంబగు, నంత బ్రహ్మమున్
59 దవిలి యనంత సౌఖ్యగుణతత్పరతన్ గనుటే ద్వితీయమౌ
నవిరళమైన సాధనతో, సాధ్యము సిద్ధముగాదె ......

ఓ చిత్తమా! ఈ బ్రహ్మచర్యంకూడా ద్వివిధంగా ఉన్నది. వీర్య నిరోధంచేత బలాన్ని ఆర్జించి, నిర్మల చిత్తాన్ని పొందటం మొదటిది. తర్వాత బ్రహ్మతత్త్వాన్ని గ్రహించి, బ్రహ్మమే తానై, అనంతానందసంపదలలో తాదాత్మ్యాన్ని పొందటం రెండవది. అవిరళమైన సాధనచేత తప్పక సాధ్యం సిద్ధిస్తుందిసుమా!

ఉ॥ దానికి సాధనల్ బలువిధంబుల నుండునుగాని యేది దే
హానికి బుద్ధికాత్మకు బునాదిగనుండెడు యింద్రియంబునే
60 పూని యొజస్సు జేయుచు, నపూర్వ వికాసము గల్గజేయునో,
దానిని బ్రహ్మచర్యమన ధర్మము నమ్మము దీని .........

ఓ చిత్తమా! దీనికి అనేక విధములైన సాధనములు ఉన్నవి. కాని ఆత్మజ్ఞానానికి, దేహానికి, బుద్ధికి, ఆధారమైన ఇంద్రియాన్ని ఓజోరూపంగా మలిచి, అపూర్వ వికాసాన్ని, ఏది కలిగిస్తుందో అదే బ్రహ్మచర్యం అనటం ధర్మం. దీన్ని యథార్థంగా విశ్వసించు.

చ॥ అదియొకదాని నీవు సముపార్జన సల్పిన బ్రహ్మతేజమే
హృది తనువాత్మలందుగడు శ్రేష్ఠతజిందుచుద్రొక్కు, సాధ్యసం
61 పద యగు సర్వసాధనలు, ప్రాప్తము శాంతియు శ్రేష్ఠమై సుఖ
ప్రదమగు బ్రహ్మచర్యమను పావనసువ్రతదీక్ష .........

ఓ చిత్తమా! ఈ ఒక్క బ్రహ్మచర్యాన్ని నీవు శ్రమ జేసి ఆర్జించినచో నీ శరీరంలో, నీ హృదయంలో, ఆత్మలో, ఆ బ్రహ్మతేజస్సు అధికంగా చిందులు తొక్కుతుంది. సకల సాధనలు సాధ్యం అవుతాయి. శాంతి లభిస్తుంది. అందుచేత యీ బ్రహ్మచర్యాన్ని శ్రేష్ఠమై, సుఖప్రదమై, పవిత్రమైన, చక్కని దీక్షగా భావించు.

చ॥ మనమును మోహనాశనము మాన్యత జేయును బ్రహ్మచర్యమే!
మనమును లొంగదీయు ఘనమంత్రము సూత్రము బ్రహ్మచర్యమే
62 మననము వృద్ధిసేసి మతిమంతుని జేయును బ్రహ్మచర్యమే!
మనకిక బ్రహ్మచర్యబలమాత్రముచేతనె ముక్తి .........

ఓ చిత్తమా! మనస్సులో ఉన్న మోహాన్ని చక్కగా నశింపజేసేది యీ బ్రహ్మచర్యమే. మనస్సును స్వాధీనం చేసుకొనే గొప్ప మంత్రము, సూత్రము, యీ బ్రహ్మచర్యమే. మనవాన్ని అభివృద్ధి, చేసి, ధీ సంపన్నతను కలిగించునది యీ బ్రహ్మచర్యమే. ముక్తి కూడా యీ బ్రహ్మచర్యబలంచేతమాత్రమేసుమా!

ఉ॥ జాలము బ్రహ్మచర్యమును సల్పెడు ధన్యుని శక్తి బోల్పగా,
జాలము బ్రహ్మచర్యఘనసారవిలోలసౌఖ్యమెంచగా,
63 జాలము బ్రహ్మచర్యసముపార్జన గల్గు ప్రకాశమెన్నగా,
జాలము బ్రహ్మచర్యమను సాధన సిద్ధి గణింప ......

ఓ చిత్తమా! ఆ బ్రహ్మచర్యాన్ని సక్రమంగా పాలించు ధన్యుని శక్తిని దేనితో పోల్చలేము. ఆ బ్రహ్మచర్యసారంలో మునిగినవాని సౌఖ్యాన్ని గూడ లెక్కింపలేము. ఆ బ్రహ్మచర్య పాలనచేత గలిగిన ప్రకాశాన్ని గూర్చి వచింపలేము. ఆ బ్రహ్మచర్యం అనే సాధనచేత లభించు సిద్ధులను గణింపలేము.

శా॥ పై లోకంబును ద్రుంచి, నిశ్చలమతిన్ భావించి లో లోక స
త్యాలన్, వాని జరింప గాననగు ద్వంద్వాతీతమౌ స్థానమున్
64 కాలంబాది నిమిత్త దేశములు లేకన్ వెల్గు మూర్తిన్ మహా
జ్వాలా శక్తిని స్వీయరూపమును శోభాశాంతితో ......

ఓ చిత్తమా! పరలోక ఆసక్తిని దీసి, నిశ్చలత్వాన్ని పొంది లోక విషయాల గ్రహించి, ఆచరించి చరించినచో దేశకాల నిమిత్త దూరమై ప్రకాశించు దివ్యమూర్తివి, మహాతేజోశక్తివి, స్వస్వరూపమును, ద్వంద్వాతీతమైన స్థానాన్ని పొంది శోభిస్తావుసుమా!

మ॥ సులభత్వంబు వరింప గష్టమగు, నీ సౌలభ్యతన్ ద్రోసినన్
సులభంబౌగద మోక్షమార్గము, సదా సౌఖ్యంబునే గోరకన్
65 గలలోనైనను కష్టమంచనక లక్ష్యార్థంబుతో మున్గి, నీ
చలనత్వంబును వీడి దుంకినగదా సంతోషమా ........

ఓ చిత్తమా! సులభంగా దొరికేవి లోకవిషయాలు. ఈ సుల భత్వాన్ని త్యజిస్తే మోక్షమార్గం సులభంగా లభ్యం అవుతుంది. సుఖాన్ని అపేక్షింపక, స్వప్నంలోనైనా కష్టంగా భావింపక, లక్ష్య సాధనలో మునిగి, నీ చపలత్వాన్ని వీడి దూకితేగదా నీకు సంతోషం ప్రాప్తిస్తుంది!

శా॥ దీనిన్ గాంచ కసౌఖ్యమున్ వలచి, తృప్తిన్ గాంచ యోచించిమా
ర్గానన్ దుంకి, సుఖంబుమారమగు ప్రారంభంబు వీక్షించి, యా
66 శానాశంబున దుఃఖమొంది, యుభయస్థానంబులన్ బాసి లో
కానన్ భ్రష్టతనొందువారి గనవే జ్ఞానార్థివై .......

ఓ చిత్తమా! ఈ రహస్యాన్ని గ్రహించలేక, సౌఖ్యాన్ని వాంఛించి, తృప్తి పొందాలని భావించి, మార్గంలో ప్రవేశించి, త్వరగా సుఖం లభించనందువుచే చింతించి, ఆశావినాశంచేత దుఃఖాన్ని పొంది ఉభయభ్రష్టులై లోకంలో ఎంతమంది ఉన్నారో చూడు! జ్ఞానాన్ని అర్థించే నీవు యీ స్థితిని గ్రహించుకో.

శా॥ సూత్రము చెప్పువాడ, విను సూక్ష్మముగా మతినుంచి, దీని నే
మాత్రములేవు యోగములు, మంత్రములేదు, జపంబు సున్న యే
67 యాత్రయు లేదు, లేవిచట వాసన కర్మలు విఘ్నంబు, నీ
సూత్రము కష్టమై మిగుల శుద్ధవివేకయుతంబు ......

ఓ చిత్తమా! నీకు సూత్రం చెప్పతున్నాను విను. సూక్ష్మంగా వుంటుంది. శ్రద్ధగా విను. దీనిలో యోగం లేదు. మంత్రం లేదు. జపం లేదు. యాత్ర లేదు. ఆసనాలు లేవు. కర్మలు లేవు. నియమ నిష్ఠలు లేవు. ఈ సూత్రం శుద్ధవివేకంతో కూడుకున్నది. కష్టైతి కష్టమైనదిసుమా!

చ॥ తెలియగ గష్టమంటినని దీనత బొందకుమమ్మ, దీని నే
సులభముగా నెరుంగ నొక సూత్రము దెల్పెద, దాని నమ్మి ని
68 శ్చలముగ జేయుదేని యిది సాధ్యము, పైనిది నిర్వరించి, నిన్
బలువిధ సౌఖ్యచంద్రికలపై నటియింపగజేయు .........

ఓ చిత్తమా! తెలియటం కష్టం అన్నానని నీవు భయపడకమ్మా! దీన్ని సులభంగా తెలిసికొనే సూత్రాన్ని నీకు తెలియజేస్తాను. దాన్ని నమ్మి, నిశ్చలంగా ఆచరిస్తే అన్ని సాధ్యం అవుతాయి. అప్పుడు ఆ స్థితి నిన్ను చేరి, నిన్ను సౌఖ్య చంద్రికలలో నాట్యం చేయిస్తుంది.

చ॥ వలసిన వస్తువుల్ వెలిరొ ప్రాప్తము కానివి, చిత్తసీమలో
దొరకుట, లోకమెందులకు? దూరమొనర్పుము, నీకు దానితో
69 గలుగదు లాభమింతయిన, కావ తలంచి, వివేకముంచి, నా
పలుకుల నాలకించి, నడువన్ ముదమొందెదవమ్మ ........

ఓ చిత్తమా! నీకు కావలసిన వస్తువులు బాహ్యంలో దొరకవు. చిత్తంలో లభిస్తాయి. ఇక లోకం దేనికి? లోకాన్ని దూరం చేసుకో. నీకు యీ లోకంతో లాభం కలుగదు. కాన ఆ విషయాన్ని గ్రహించి, వివేకంతో నా మాటల నాలకించి నడచినచో సంతోషాన్ని పొందుతావమ్మా!

మ॥ 'ఇది యిట్లుండును, కాదు వే' రనుచు నీవీరీతి యోచించుచో
నది 'యిట్లుండదు వేరు గా'దనుచు సర్వాతీతమై యొప్పెడున్
70 'ఇది ఎట్లున్నది?' యంచు నిర్మలమతిన్ హృద్వీధి వీక్షింప నె
మ్మది ప్రత్యక్షముగాదె యాత్మ నిజధర్మంబొప్పగా ......

ఓ చిత్తమా! 'ఇది యీ విధంగా ఉంటుంది. కాదు వేరు' అని 'అది యీ విధంగా ఉండదు. వేరు కాదు' అని ఆలోచిస్తే సర్వాతీతంగా ఉంటుంది. 'ఇది ఏ విధంగా ఉన్నది?' అని నిర్మలంగా హృదయవీధిలో వీక్షించిన, నిజధర్మంతో ఆత్మప్రత్యక్షం అవుతుందిసుమా!

ఉ॥ ఇంతకు బాహ్యమున్ మరచుటే ప్రథమంబగు దీన, దానితో
స్వాంతమునందు నమ్మకము శక్తియు గల్గును, పైన సాధనల్
71 శాంతవిధాన సాగు, నిజ శక్తిని నమ్ముట మోసపోక ని
శ్చింత జరించి పొందెదవశేషసుఖప్రదముక్తి ........

ఓ చిత్తమా! అసలు దీనితో బాహ్యాన్ని మరచిపోవటమే మొదటిది. దానిచేత లోపల విశ్వాసం, శక్తి కలుగుతవి. తర్వాత సాధనలు శాంతంగా సాగిపోతాయి. తన శక్తిని గ్రహించుకోటంలో కూడా మోసపోరాదు. అప్పుడే నిశ్చింతగా చరించుచు, అనంతసుఖప్రదమైన ముక్తిని పొందగలవుసుమా!

మ॥ క్షణమైనన్ విడరాదు, దీని గురులక్ష్యంబుంచ ముఖ్యంబు, కా
క సుఖప్రాయము సందు ఏర్పడిన, మాయాశక్తి లోజొచ్చి, త
72 క్షణమే ధ్వంసమొనర్చు సర్వమును, ఏ కార్యంబు కష్టంబు
కావున నేర్పొప్పు మెలంగి, నిన్మరువకే ముఖ్యంబుగా ......

ఓచిత్తమా! ఒక్క క్షణంకూడ దీన్ని దూరం చేయకూడదు. ముఖ్యంగా దీనియందు గొప్ప లక్ష్యం ఉంచాలి. లేనిచో అణుప్రాయమైన ఏమరుపాటు కలిగినా మాయాశక్తి లోన ప్రవేశించి, అంతా నాశనం చేస్తుంది. ఈ విషయం చాల కష్టం. కాన నేర్పుగా మెలగుచు, నిన్ను మరిచిపోవద్దుసుమా!

మ॥ అగుటన్ నిత్యము సాధనానియతి శ్రేయస్కామివైయున్న, జే
రగ రాజాలునె దుష్ట భావములు ధైర్యంబొప్పగా గాంచి నిన్,
73 జగమే కంపము జెందు నీ పరమ తేజశ్శ్రీని గాంచంగ, బ్రా
పుగ నాత్మైక్యము చేతనుండునుసుమా పూర్ణంబుగా .......

ఓ చిత్తమా! నిత్యం నియమబద్ధమైన సాధనతో శ్రేయస్కామివై యున్నచో, ఏ ధైర్యంతో నిన్ను దుష్ట భావములు ఏ విధంగా చేరతాయి? నీ పరమైన తేజోపుంజాన్ని చూడటానికి లోకమే కంపిస్తుంది. నీకు పరిపూర్ణంగా ఆత్మైక్యం ఉంటుంది సుమా!

మ॥ 'బలహీనేన న లభ్యమాత్మ' యను సద్వాక్యార్థమిచ్చోటనే
చెలగున్, బుద్ధి శరీరమాత్మబలముల్ శ్రేష్ఠంబుగా బొంద, ప్రా
74 ప్తిలు సామర్థ్యము నాత్మశక్తి యట, నాత్మీయంపు విశ్వాసమున్
గలుగున్ సిద్ధులు గీర్తులున్ ప్రతిభ మోక్షార్థంబులున్ .......

ఓ చిత్తమా! శరీర, బుద్ధి, ఆత్మ బలములలో 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అను వాక్యార్థములో ఆత్మబలమే శ్రేష్ఠమను విషయం సువ్యక్తం. ఆత్మశక్తి, ఆత్మవిశ్వాసం, సామర్థ్యములు అక్కడ ప్రాప్తిస్తాయి. అప్పుడే మోక్షార్థం సిద్ధులు, కీర్తులు, సర్వం లభిస్తాయి.

ఉ॥ చేయగలట్టి శక్తి గని జేయకయున్నను జాలు ధాత్రిలో,
గాయము నెంచకుండ క్షణకాలము డాయక శక్తి జూపుచున్,
75 జేయవలెన్ ప్రధానమగు జింతల సాధన నాత్మబొందగా,
నీ యుపయుక్తమార్గము గ్రహింపుమవశ్యము వెర్రి ........

ఓ వెర్రిచిత్తమా! లోకంలో శక్తిని సంపాదించి ఏమియు చేయక, లోపముల నెంచక, క్షణంకూడా మరువక, ఆత్మను పొందుటకు ముఖ్య విచారణ శక్తితో జేయుచు, సాధన సలుపవలెను. వెంటనే యీ ఉపయోగకరమైన మార్గాన్ని గ్రహించుకో.

ఉ॥ జాగ్రత జాగ్రతంచు బలుసారులు మేల్కొలుపుల్ బఠించుచున్
అగ్రము జేరుదాక తనువంతట జాగ్రత మార్మ్రోగ, నీ
76 యుగ్రతపంబొనర్పుము మహోత్తమ దీక్ష ధరించి, మించి, ఏ
కాగ్రత ప్రజ్వలింప, నిదియేసుమ సాధన వెర్రి ......

ఓ చిత్తమా! 'జాగ్రత జాగ్రత' అని అనేక పర్యాయముల మేల్కొలుపుల పఠిస్తూ, శిఖరం చేరేవరకు శరీరమంతటా జాగ్రత మారు మ్రోగించుకుంటూ, ఉత్తమ దీక్షతో మించి, ఉగ్రతపస్సున చెయ్యి. ఏకాగ్రత ప్రజ్వలింపజేసికో. ఇదే సాధనసుమా!

ఉ॥ హెచ్చుగ విద్య నేర్చినను దృష్టిని సాధన నుంచకున్నచో
మెచ్చడు దేవుడున్, జగతి మేలనదే, యనుభూతిలేక నే
77 మిచ్చెదవమ్మ భక్తులకు హీనదశన్ బడియుండి, గల్గనే
బిచ్చపుగాడు బిచ్చమిడ? వీడుము భ్రాంతిని వెర్రి ........

ఓ వెర్రిచిత్తమా! అధికంగా విద్యనేర్చినా సాధనపై దృష్టిని నిలపనిచో భగవంతుడు మెచ్చుకోడు. ప్రపంచంకూడా యిష్టపడదు. నీవే హీనదశలో, అనుభవరహితవై ఉంటే యిక భక్తులకు ఏమి యివ్వగలవు? యాచకుడు యాచకునికి ఏమివ్వగలడు? కాబట్టి అటువంటి భ్రాంతిని దూరం చేసుకో!

శా॥ గ్రంథజ్ఞానము వ్యర్థమంచనను, నా గ్రంథస్థమౌ భాషనే
యంధత్వంబున స్వీకరింపకయె, భాషాతీతమౌ భావ సం
78 బంధంబున్ గని దాని మార్గమున బోవన్ బూనుటే దివ్యమౌ
బంధచ్ఛేదకమైన సాధన యదే భాష్యంబగున్ …………

ఓ చిత్తమా! గ్రంథజ్ఞానం అనవసరంకాదు. కాని ఆ గ్రంథస్థమైన భాషనే గుడ్డిగా స్వీకరించకు. భాషాతీతమైన భావసంబంధాన్ని గ్రహించి, ఆ మార్గంలో ప్రయాణం చేయటమే దివ్యమైన బంధవినాశకమైన సాధనసుమా!. అదే భాష్యం అవుతుంది.

ఉ॥ శక్తికిమించు సాధన యశస్సులకో, యవివేకమొందియో,
శక్తిని ధారవోయుటిక జాలును తీవ్రపు చింత జేసి నీ
79 శక్తి నెరింగి సాధ్యమగు సాధన బూనుము, నీకు దానిచే
శక్తి సుఖంబు డెంతయున శాంతియు గల్గగదమ్మ …………

ఓ చిత్తమా! సాధనలో కొన్ని విధానాలున్నవిసుమా! అవివేకంతో, కీర్తికోసం, శక్తికి మించిన సాధనచేసి, శక్తిని ధారపోయటం మంచిదికాదు. నీ శక్తిని గ్రహించుకొని, తీవ్రంగా ఆలోచించి, నీకు సరిపడు సాధననే సాగించుకో. దానిచేత నీకు హృదయంలో శాంతి సుఖం లభిస్తాయమ్మా!

ఉ॥ అందని మ్రానిపండ్లకొరకై పరువెత్తుటగాదె! యిట్టి నీ
కందని సాధనానియతి, అందు ప్రయోజనమేమిటమ్మ! ఆ
80 నందములేక విభ్రమమునందు మునుంగుదువమ్మ! కాన నీ
చందము శక్తికిన్ దగిన సాధన మంచిదిగాదె, ......

ఓ చిత్తమా! నీ శక్తికిమించిన సాధన చేయటం అందని చెట్టు పండ్లకోసం పరుగులు వేయటంవంటిదని గ్రహించుకో. దానివలన నీకు ప్రయోజనం ఏమిటి? ఆ శక్తికిమించిన సాధనలచేత ఆనందం లేకపోగా భ్రమలో మునిగిపోతావు. కాబట్టి నీ శక్తికి తగిన సాధనా విధానం చాలా మంచిదిసుమా!

ఉ॥ యోగము మంచిదే, జపము యోగ్యము, ధ్యానముగూడ శ్రేష్ఠమే
త్యాగము నుత్తమంబు, భజనాదులుసైతము మంచివేసుమా!
81 బాగుగ విద్య నేర్చుటయు బాడియ, గాని మనంబు సాధనా
యోగనిమగ్నమైనగద యొప్పును సాధనలందు ......

ఓ చిత్తమా! యోగం మంచిదే, జపం యోగ్యమైనదే, ధ్యానం కూడా శ్రేష్ఠమే. త్యాగం ఉత్తమంసుమా! భజనాదికాలు మంచివే, చక్కగా విద్యనభ్యసించటం మంచిదే. కాని మనస్సు సాధనా యోగంలో నిమగ్నం అయితేగాని సాధన కాదుసుమా!

ఉ॥ కాన విచక్షణాపరతి గామమడంచి, మహేశు శుద్ధ చి
త్తాన ప్రతిష్ఠ జేసి, నిరతంబు నహీనచరిత్రనున్న, సు
82 జ్ఞానవిభూతి నాత్మ గననౌనని నమ్ముము, సాధనా నియో
గాన జరించి యుండుమిక గాలమమూల్యముసుమ్ము ......

ఓ చిత్తమా! కాబట్టి విచక్షణా జ్ఞానంతో కామాన్ని అణచి, శుద్ధ చిత్తంలో మహేశ్వరుని ప్రతిష్ఠించి, నిత్యం పవిత్రజీవనం సాగించినచో, సుజ్ఞాన విభూతియైన ఆత్మను పొందగలమని నమ్ము. కాలం అమూల్యం అయినది. కాబట్టి యిక నియమబద్ధమైన సాధనలో సంచరించు.

ఉ॥ చేయుట సేయనేర్పునను శిష్టపదంబుల లక్ష్యముంచకన్
జేయక జేయనేర్పుమని జేరిన బెద్దల లాభమున్నదే!
83 చేయుటదెట్టులంచు మది జింతిలుచుండిన జింత దీరునే?
చేయుచు బట్టుతో మరల సేయుట సాధనయౌను .......

ఓ చిత్తమా! 'చేయుట చేయించుట నేర్పును' అను సూక్తుల నిర్లక్ష్యము జేసి, ఏమియు చేయక, చేయటం నేర్పుమని పెద్దల జేరిన ప్రయోజనమేమున్నది? లేక 'చేయటం ఎట్లు?' అని చింతిస్తూ ఉంటే చింతలు తీరుతాయా? పట్టుదలతో మరల మరల చేయటమే సాధన అవుతుందిసుమా!

ఉ॥ సాధన యన్న నేమి? కడు జాగ్రత నాత్మపరీక్ష సేయుటే
సాధన, దోషమున్న సువిశాలమనంబున సంస్కరించుటే
84 సాధన, మార్గమందు దన స్థానమెరుంగుచు మించజూచుటే
సాధన, సాధనంబున నసాధ్యము సాధ్యముగాదె .......

ఓ చిత్తమా! అసలు సాధనంటే ఏమిటి? చాల జాగ్రత్తతో ఆత్మ పరీక్ష చేసుకోటమే సాధన. దోషం ఉంటే విశాల మనస్సుతో దానిని సంస్కరించటమే సాధన. మార్గంలో తన స్థానాన్ని గ్రహించుకుంటూ మించి పోవాలనేదే సాధన. సాధనచేత అసాధ్యము సాధ్యము చేసుకోవచ్చునుసుమా!

శా॥ ఏ కార్యంబుల జేసినన్ బలికినన్ హృద్వీధి యోచించినన్
నీకున్ దాని ఫలంబుగా గలుగునే నిక్కంపు మోక్షార్హతల్?
85 చేకూరంగలదే ముదంబని సదా చింతించి తీవ్రంబుగా
నేకాగ్రస్థితినుంట సాధనసుమా యింతేలనో .......

ఓ చిత్తమా! లోకంలో ఏ పనులు చేసినా, మాట్లాడినా హృదయంలో భావించినా, వాని ఫలితంగా నీకు యథార్థమగు మోక్షార్హతలు కలుగుతాయా? లేక ఆనందం కలుగుతుందా? అని తీవ్రంగా ఆలోచించి, ఏకాగ్రస్థితిలో ఉండటమే సాధనసుమా!

చ॥ భయమనలేదు సుంతయిక భారము సాధనమీద నున్నచో,
భయవినయంబులన్ గలిగి పర్విడు నీ వెనువెంట లోకముల్,
86 ప్రియమున బెద్దలెల్లరు భళీ భళీ యందురు గాన, సాధనా
మయమొనరింపు జీవితము మాటలు వేయిగనేల ........

ఓ చిత్తమా! సాధనమీద భారం ఉంచితే నీకు భయం ఉండనే ఉండదు. భయవినయాలతో లోకం నీ వెనుక పరుగులు చేస్తుంది. పెద్దలు ప్రేమతో మెచ్చుకొంటారు. కాన నీ జీవితాన్ని సాధనామయం చేసుకో ఆచరణలేని మాటలెందుకు?

ఉ॥ తక్కువ కాయకష్టము, యథార్థ విరాగము, చిత్తసీమలో
నెక్కువ తీవ్ర వేదనయు నెంచగ సాధనయౌను వానిలో
87 నొక్కటి లోపమైన నిక నుత్తమ తత్త్వవిభూతిరాదు నా
నొక్కి వచించువాడ నిదుగో వినుమంతటనైన .......

ఓ చిత్తమా! ఇందులో కాయకష్టం తక్కువగా ఉంటుంది. యథార్థ విరాగం ఉండాలి. చిత్తంలో తీవ్ర ఆవేదన ఉండాలి.

ఈ త్రయం సాధన. పై మూడింటితో నే ఒక్కటి లోపించినను యిక ఉత్తమ తత్త్వానుభూతి కలుగదు అని నీకు గట్టిగా చెప్పుతున్నాను. యిప్పటికైనా నా మాట విను.

ఉ॥ సాధన, జాతి వర్ణ మత జాడలెరుంగదు, లింగభేద దుర్
బాధల పొందబోదికను, ప్రాయ విచక్షణ చేయబోదు, నీ
88 ధీ ధన ధాన్య సంపదల ధీరత జూడదు, గాని నీదు హృత్
శోధన నాశ్రయించి మనుచుండును బానిసభంగి ... ...

ఓ చిత్తమా! ఈ సాధనలో జాతి, మత, వర్ణ, వ్యవస్థలులేవు స్త్రీ, పురుషులు అను లింగభేదములు లేవు, వయస్సు విచారణ లేదు. తెలివితేటలు, ధనదాన్య సంపదలను చూడదు. కాని నీ హృదయ పరిశోధన నాశ్రయించి, యీ సాధన బానిసవలె నిన్నాశ్రయించి ఉంటుందిసుమా!

చ॥ మడిమయిలాది నీమముల మాటలు లేవిట, జేయు కాంక్ష గ
ల్గెడు గడియే శుభప్రదము, కేవల నిర్మల చిత్తముండుటే
89 మడి యగు, దీని మర్మము సమంచితరీతి గ్రహించి, చక్కగా
నడచిన సాధనందురిది నాణ్యవిధానముసుమ్మి ......

ఓ చిత్తమా! ఈ సాధనలో మడి, మైల, అను నియమాలు లేవు. సాధన చేయవలెననే తీవ్ర కాంక్ష కలగటమే సుముహూర్తం. నిర్మలమైన మనస్సు ఉండటమే మడి అని అర్థం. దీని రహస్యాన్ని చక్కగా గ్రహించుకొని, చక్కగా నడిచినచో దీనినే సాధన అంటారు. ఇది మంచి మార్గము సుమా!

ఉ॥ చూచుచు జూడనట్లు, వినుచున్ విననట్టుల, లోన దోచియున్
దోచనియట్లు, దీక్షగతి దూరపు దృష్టుల గల్గి, సాక్షివై

90 చూచుచునుండుచో జగతి శూన్యము దాల్చెడు, నాత్మస్పష్టమై
దోచుచు, సాధనంబనగ దుష్కరమై సులభంబు ......

ఓ. చిత్తమా! ఈ లోకంలో చూస్తూ చూడనట్లుగా, వింటూ విననట్లుగా, లోపల ఆలోచించియు ఆలోచించనివిధంగా, తీవ్రంగా, దూరదృష్టుల గలిగి, సాక్షివై చూస్తూ ఉంటే, లేని జగత్తులేకుండి నిత్యమైన ఆత్మ సుస్పష్టం కాగలదు. సాధన అనగా మొదట కష్టమై, పిదప సులభంగా ఉంటుందిసుమా!

ఉ॥ సాధనచేతనేగద ప్రశస్త విముక్తి గడించిరా ఋషుల్
సాధనచేతనే యుపనిషత్ ద్యుతి ధారుణి ప్రజ్వలించె, నా
91 సాధనచేతగాదె గనె శక్తిని రాయిలొ రామకృష్ణుడున్
సాధనచేత నె ధ్యపడజాలనిదెద్దియు లేదు ......

ఓ చిత్తమా! సాధనలేనిదే ఏమీ చేయలేముసుమా! మహర్షు లందరూ ప్రశస్తమైన విముక్తిని పొందారు యీ సాధన చేతనే. ఈ సాధనచేతనే ప్రపంచంలో ఉపనిషత్ తేజోపుంజము ప్రకాశిం చింది. ఈ సాధనచేతనే శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు జడమైన రాయిలో జగన్మాతను దర్శించాడు. సాధనచేత సాధ్యంకానిది ఏదీ లేదుసుమా!

ఉ॥ ఏగతి భానుబింబముదయింపక బూర్వము స్వర్ణకాంతు లు
ద్యోగముతో జనించి మహితోన్నతి భాస్కరు రాక జాటునో
92 ఆ గతి స్వాత్మ నమ్మకము అద్భుత భాస్వర కాంతిపుంజమై
రాగవిభూతినాత్మలయలక్షణమున్ బ్రకటించు ......

చిత్తమా! సూర్య భగవానుడుదయింపకముందు కాంతి కిరణములు జనించి, దివాకరుని మహిమను, రాకను ఎట్లు తెలుపునో అదేవిధంగా ఆత్మవిశ్వాసం తేజోవంతమైన అద్భుత కాంతిపుంజమై వచ్చి, ఆత్మవిభూతిని సూచిస్తుంది.

ఉ॥ సాధన సాధ్యమౌ నిక, విశాలత గల్గు మనంబునందు, నే
బాధలు లేక మార్గమిక భాసిలు సున్నితమై, విశాలమై,
93 క్రోధ సమూహమంతమగు, గోరికలెల్ల నశించు, దీనికై
సాధన సల్పుమమ్మ యిక శాశ్వతముక్తి లభించు ......

ఓ చిత్తమా! అప్పుడు సాధన సాధ్యం అవుతుంది. మనస్సులో విశాలత్వం సిద్ధిస్తుంది. ఏ బాధలు లేక మార్గం సున్నితంగా, విశాలంగా ప్రకాశిస్తుంది. కామక్రోధాదిక సమూహం నశిస్తుంది. కోర్కెలన్నీ అంతం అవుతాయి. దీనికోసం సాధన చేయమ్మా! ఆ సాధనచేత శాశ్వతముక్తి లభిస్తుంది.

చ॥ అనుభవమా? యభావముగదా వెలియందు, మనంబునుండు నా
యనుభవమున్ గడింపగ హృదంతర్గవీధుల బర్వులెత్తుచో
94 ననయము శాంతిధామమున హాయి విహారము సల్పుచుందు వా
గుణపథమున్ వరించి యదిగో సుఖమున్ గనుమమ్మ ......

ఓ చిత్తమా! అనుభవమంటే బాహ్యంలో లేదుసుమా! మనస్సులో ఉంటుంది. ఆ యనుభవాన్ని సంపాదించటానికి హృదయాంతర్గత మార్గములందు పరుగులు వేయాలి. అప్పుడు సదా

శాంతిధామంలో హాయిగా విహారం చేయగలవు. ఇక ఆ మంచి మార్గాన్ని వరించి యథార్థ సుఖాన్ని పొందగలవు.

ఉ॥ జ్యోతికి మధ్యనున్నదగు జ్యోతియ, చీకటిలోని చీకటుల్
జేతనతత్త్వమందుగల చేతనశక్తియ, శాంతి శాంతికిన్,
95 ధాతకు ధాతయై చెలగు తత్త్వము సెప్పగ నేరికౌను? ఆ
జ్యోతి నెరుంగు మార్గమిక నుత్తమ సాధనగాదె ......

ఓ చిత్తమా! ఆ యాత్మ జ్యోతులకు జ్యోతియైనది. చీకటికి చీకటియైనది. చేతనత్వంలోని చేతనమైనది. శాంతికి శాంతమైనది. సృష్టకు సృష్టయైనది. ఇటువంటి ఆత్మను గూర్చి ఎవరు చెప్పగలరు? ఆ జ్యోతిని తెలుసుకొను మార్గమే ఉత్తమ సాధన గదా!

మ॥ వినినావా! కనుమొక్కసారి యటు గంభీర ప్రకాశాత్మవై,
వినరానట్టి వినిర్మలత్వమున స్థంభీభూతమై శాంతమై,
96 అనవద్యంబగు నాత్మసంస్థితులలో నైక్యంబవై, బ్రహ్మమం
దు నభేదస్థితి నుండగల్గుదువు సద్యోగంబునన్ ......

ఓ చిత్తమా! ఒక్కసారి చూడు. అనవద్యమైన ఆత్మ సంస్థితులలో ఏకత్వాన్ని పొంది, గంభీర ప్రకాశాత్మవై, నిర్మలత్వంలో మునిగి, శాంతమూర్తివై నీవేనాడు వినరాని అభేద బ్రహ్మసంస్థితులలో నైక్యమై, సద్యోగంలో ఉండగలవు. విన్నావా?

శా॥ గమ్యస్థానము సెప్పరానిది, మహాగంభీరమై, నిత్యమై,
సౌమ్యంబై, సగుణంబు నిర్గుణమునై, సౌఖ్యాబ్ధిసంపూర్ణమై,

97 సామ్యస్థానవిదూరమై, యతులమై, శక్తిస్వరూపంబునై,
గమ్యస్థానమతీతమై తనరు దుర్గ్రాహ్యంబుగా ......

ఓ చిత్తమా! ఆ గమ్యం ఎటువంటిదో తెలుసునా? ఆ గమ్యాం వచింప వీలుకానిది. మహాగంభీరమైనది. నిత్యమైనది. సౌఖ్యమైనది. సగుణమైనది. నిర్గుణమైనది. సంపూర్ణసుఖసాగరమైనది.దానికిసమాన మైన మరియొక స్థానములేనిది. అతులమైనది, శక్తి స్వరూపమైనది గ్రహించుటకు వీలుకానిది, అతీతమైనది. ఇదే గమ్యస్థానం.

చ॥ కనగ వచింపగన్ వినగ గైకొనగన్ జదువంగ దూరమై
తన నిజతత్త్వమందరికి దగ్గరనుండియు నంటకుండు, న
98 ట్లనుపమ నిర్మలత్వమున నందనిదై యతిసూక్ష్మమై సదా
యనుభవనీయమై తనరు నవ్యయమైనది యాత్మ ......

ఓ చిత్తమా! ఆ యాత్మ చూడబడదు. వాక్కు వివరించ లేదు. చెవులు వినలేవు. చేతితో స్పృశింపబడదు. యోచనకు అంద నిది. అందరికి సన్నిహితమైనను అందనిది. అది అతి నిర్మల మగుటచే నందనిదై, అతి సూక్ష్మమైనది. అవ్యయమైనది. సదా ఆ యాత్మ అనుభవైకవేద్యమే యగుచున్నది.

ఉ॥ అంతట నిండియుండు యఖిలాండములందు వసించుచుండి యా
వంతయు గోచరింపక నియంతగనుండి చరించునాత్మ, ఏ
99 కాంతమునందు సాధన భయంబుల వీడుచు, జేయు సాధక
స్వాంతములందుమాత్రము విశాలత గోచరమౌను ......

ఓ చిత్తమా! ఆ యాత్మ అంతట వ్యాపించి యున్నను దృగ్గోచరముకాక నియంతగా నుండి శాసిస్తుంది. ఏకాంతంతో

భయములేక సాధనల కలుపుచున్న సాధకుల హృదయములం మాత్రము విశాలంగా గోచరిస్తుంది. అదియే ఆత్మ.

ఉ॥ అందును యందకుండును మహాద్భుతశక్తిగలట్టి యాత్మ, పు
ట్టొందును పుట్టకుండును మహోన్నతశక్తిగలట్టి యాత్మ, ఆ
100 నందము గల్గి గల్గనిది నర్తనశక్తిగలట్టి యాత్మ, యీ
చందము వింతతత్త్వములసారము దూరము, ఆత్మ ......

ఓ చిత్తమా! ఆ యాత్మ అంది అందక ఉండే అద్భుతమైన శక్తి గలది. ఆ యాత్మ పుట్టి, పుట్టక ఉండే ఉత్కృష్టమైనది. ఆ యాత్మ ఆనందము కలిగి, కలగని నర్తనశక్తి గలది. వింత తత్త్వముల సారము, దూరమైనదిసుమా ఆ యాత్మ!

హరిః ఓం తత్ సత్

---



---